# శ్రీబలరామశతకము.

పూర్వకవి

సాతులూరి సుభద్రాచార్యవిరచితము.

ప్రకాశకులు,

సాతులూరి వేంకటనరసింహాచార్యులు,

ప్రధానోపాధ్యాయుఁడు,

బోర్డుప్రాథమికపాఠశాలా, తణుకు.

తణుకులో డి. వి. శ్యామలరావు గారి

శ్యామలా అర్టు ప్రెస్సునందు

ముద్రింపబడియె

1931

 0—2—0

# విజ్ఞప్తి

ఈకవి మాప్రపితామహులు, వీరు 1779 వ క్రీస్తువత్సరమున జన్మించిరి. పోలవరము జమీందారులగు శ్రీకొచ్చెర్లకోట జగన్నాధరావువారి యాస్థానమునఁ బండితులుగనుండి, వారిచే "రవణక్క పేట" యను నగ్రహారమును గారవార్థముగఁ బడసిరి.

వీరురచించిన గ్రంథములు—గారుడశైలశతకము, నృసింహశతకము, వైజయంతీస్తవము (సంస్కృతము) ఎనుబది రెండు వార్తలు, మున్నగునవి కలవు. వీనిలో నెనుబది రెండు వార్తలను బదునారు సీసపద్యముల చిఱుపొత్తము నిది వరలో నచ్చొత్తించి ధన్యుఁడనైతిని.

ఇప్పుడు దీని నచ్చొత్తించుటలో జమీందారులును, తణుకు తాలూకాబోర్డు ప్రెసిడెంటులును నిరంతర సారస్వతరసిక లోలురునగు శ్రీముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారు ధన

సహాయముంజేసి కవిలోకమునం దాదరణఁ జూపినందులకు శ్రీ శ్రీనివాసమూర్తి కీతని సంతతైశ్వర్యాభివృద్ధియు పుత్రపౌత్రాభివృద్ధియు, దీర్ఘాయువు నొసఁగి రక్షించుగాత.

ఇట్లు

కవిలోక విధేయుఁడు

సాతులూరి వేంకట నరసింహాచార్యులు.

ప్రధానోపాధ్యాయుఁడు,

బోర్డుప్రాథమిక పాఠశాల.

14-8-31 తణుకు.





# పీఠిక.



పాఠక మహాశయులారా!

ఇమ్మహాకవి కవిత్వధార నిరర్గళంబై, మృదుపద సౌష్ఠవాంచితంబై, యుపమాలంకార శోభితంబై, భక్తిరస ప్రాధాన్యంబై విరాజిల్లుచున్నయది. శయ్యాచాతుర్యమందేమి? నిందాగర్భితస్తవ కౌశలము నందేమి? అసమాన సాహిత్యగరిమా విశేషంబునందేమి? పారవశ్యకత యందేమి? యమకాతిశయమునందేమి?యిక్కవి నపరపోతనావతార మనక తీరదు. ఏతద్విషయకంబులు సత్యాధిష్ఠితంబులేయని వక్కాణించుటకై స్థాలీపులాక

న్యాయముగఁ గొన్ని పద్యము లీక్రింద నుదహరించుచున్నాఁడను; కాన కవితాసారస్య సంగ్రహణ చతురమతులు చూచి యానందింతురు గాత.

సీ॥ విలుకాఁడ నేనని ♦ వృక్షంబు చాటొగ్గి,
వాఁడిఁ శరంబున ♦ వాలిఁ జంపెఁ;
గామితార్థము లిచ్చు ♦ ఘనుఁడ నేనని తెల్పి,
కోరిరక్కసి ముక్కుఁ ♦ గోసివేసె;
వటుఁడునై బలిచక్రి ♦ వర్తిని ధ్రిమఁబెట్టి,
భువనత్రయముఁ గొల్చి ♦ పుచ్చుకొనియె;
స్వపదభక్తిని మించు ♦ త్రిపురదైతేయుల
భంగింప శివునకుఁ ♦ బాణమయ్యెఁ;

గీ॥ దమ్ముఁడేనాఁడు మాయలఁ ♦ గ్రమ్మకుండె;
నాతని మాయల దాఁటింపఁ ♦ జతురుఁడీతఁ
డగుచు గోలలు నీపాట ♦ లాడుకొనరె!
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

సీ॥ సమర రంగాహిత ♦ సాధ్యసధ్వనియగు,
శంఖంబునకు మృదు ♦ స్వనము గలదె!
బలుసనాయిలలోనఁ ♦ బల్కు పల్కులకెల్ల,
సరసంపుఁ దేఁ దీపి ♦ చవులు గలవె!
కదన జయస్వన ♦ కాహళంబులకెల్ల
రమణీ విమోహన ♦ రవము గలదె!
ఘనమృదు స్వనమృదం ♦ గంబున కేవేళ,
మునిజన మోహన ♦ స్వనముగలదె!

గీ॥ యనుచు వంశంబు మ్రోసెనో ♦ యనితలంప
నధరసుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబు ♦ బాడితీవు
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

ఈయపూర్వశతకరాజ మిదివరలో తాళ పత్రలిఖితమై, జీర్ణంబై, పాఠకపఠనా సౌకర్యంబై యున్నయది; అద్దానినిప్పుడు ముళ్ళపూడి వంశప పయః పారావార రాకాసుధాకరులును, ఉదార

సాహస, విద్యాభిలాషాది సద్గుణసంయుతులును, లోకోపకారపారీణులును, జమీందారులును నగు తిమ్మరాజు చౌదరిగారు పండిత పామరాహ్లాదకరంబుగ గుణదోషంబులఁదొలఁగించియచ్చొత్తించి నందుల కెంతయుఁ బ్రశంసనీయులరు. లోకులిందలి రసాస్వాదనం బొనర్చి సంతసించి మేలువడయుదురు గాత.

కపిల మల్లేశ్వరము
22—8—1831

ఇట్లు,
విధేయుఁడు,
వ॥ రాధామనోహరశర్మ.



# శ్రీ బలరామ శతకము.



సీ. శ్రీకోరుకొండ నృ ♦ సింహుల సేవించి
భద్రాద్రి రాములఁ ♦ బ్రస్తుతించి
శ్రీరంగనాయక ♦ శ్రీపాదముల మ్రొక్కి
కంచి వరదరాజ ♦ కథ దలంచి
రామానుజాచార్య ♦ రమ్యాంఘ్రులనుబట్టి
భక్తి నడాధూరు ♦ వరదుఁ గొలిచి
సకలభాగవతాఙ్ఘ్రి ♦ సలిలంబుఁ జేకొని
శ్రీరమాపాదాబ్జ ♦ సేవఁ జేసి

గీ. వీరశృంగారరసధుని ♦ విశద సీస
పద్యశతకంబు నీపాద ♦ పద్మమందు
జేర్చి పూజింతు నన్ను ర ♦ క్షింపుమయ్య
రేవతీరామ! బలరామ! ♦ రిపువిరామ!

## శ్రీ బలరామశతకము.

సీ. నిఖిలోపనిషదర్థ ♦ నిపుణపారాశరి
ఘనతర్కశాస్త్రజ్ఞ ♦ గౌతముండు
పటుమహాభాష్యార్థ ♦ పదవీపతంజలి
కయ్యట గ్రంథార్థ ♦ ఖండనుండు
గాదాధర గ్రంథ ♦ ఖండన చతురుండు
మీమాంసకౌఘు జై ♦ మిని గురుండు
కపిల మునివ్యాస ♦ గాథైకతాకార
కఠినగీస్త్రగ్రన్థ ♦ కరణచతురుఁ
గీ. డట్టి ప్రతివాది భీకరా ♦ ఖ్యాన్వ్వాయ
శరధి చంద్రుని రాఘవ ♦ గురుని మదిని
దలఁచి సేవించి వినుతింతు ♦ దాస్యమొప్ప
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ.!

### శ్రీ బలరామశతకము.

సీ. ప్రతివాదిభీకరా ♦ ప్రతిమ వంశాంబోధి
చంద్ర రాఘవ దేశి ♦ కేంద్రసాంద్ర
కరుణాకటాక్షాన ♦ గతతర్క వేదాంత
సిద్ధాంతపద్ధతి ♦ క్షేమయుతుఁడ
బాల్యకాలాభ్యాస ♦ ఫలితాంధ్ర గీర్వాణ
కవితామనోహర ♦ కల్పనుండ
సాధుభరద్వాజ ♦ సంతతి జాతుండ
క్షేమసుభద్రార్య ♦ నామధరుఁడ

గీ. నాదుహృదయాబ్జ కర్ణికా ♦ వేది నిలిచి
విదిత వివిధోపమోత్ప్రేక్ష ♦ విమలసీస
పద్యశతకంబుఁ జెప్పించు ♦ హృద్యముగను
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ. పటుసాంద్ర నవరత్న ♦ భాసురమకుటంబు
క్రతుభుగర్పిత్రరత్న ♦ రాశియనఁగ
మొదలఁ జెక్కిన కెంపు ♦ పొడిదేవవీజిత
ఘనతరమణికడం ♦ గరమనంగ
అతిమూలనిర్మితా ♦ వృత రత్నమణి రాజ
సురలెల్లఁ జుట్టు మె ♦ ల్పుట్టనంగ
మధ్యస్థ ఘననీల ♦ మణులు వేల్పులు వేయు
భద్రమౌ శ్రీరామ ♦ ముద్రలనఁగ

గీ॥ గోపసుందరులందఱుఁ ♦ గూడి మదిని
దలఁచి ముదమంది వెఱఁగంది ♦ వలపుఁ జెంది
నిన్ను సేవించిరా సౌబ ♦ గెన్నఁ దరమె
రేవతీరామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ. కామిన్యలంక్రియా ♦ కాలసుందర నిజ
ముఖపద్మ దర్శన ♦ ముకురమనఁగ
తరుణీవిలోచనో ♦ త్పలవితాన వికాస
భృతిహేతు శుభ్రాంశు ♦ బింబమనఁగ
నారీమణీ గణ ♦ నయనషట్పద హర్ష
మధుదాన దక్షతా ♦ మరసమనఁగ
భామినీ రత్నసం ♦ పాదిత సౌందర్య
భాసురామృత పాన ♦ పాత్రమనఁగ

గీ. వెలయు నీమోము సేవించి ♦ వివిధమునులు
మోహవశులైరి పరపురు ♦ షేహలైన
చేడియలు చూచి మోహించుఁ ♦ జిత్రమగునె!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

# శ్రీ బలరామశతకము.

సీ. వదనాబ్జ లావణ్య ♦ వర మకరందంబుఁ
గ్రోలవచ్చిన తేఁటి ♦ చాలనంగ
స్మరధన్వి బొమవింట ♦ గుఱినంట నేసినఁ
దూలు నల్లని కల్వ ♦ తూపనంగ
మధురగానవిలీన ♦ మకుట నీలంబులు
జాఱివచ్చిన నల్పు ♦ చాలనంగ
దరహాసచంద్రికో ♦ ద్భాసితాస్య శశాంక
లలిత వినీల క ♦ ళంకమనఁగ

గీ. మెఱయు నీఫాల భాసుర ♦ మృగమదాభి
రామతిలకంబు సేవించి ♦ రమణులెల్ల
మన్మథోప నిషద్గాథ ♦ మరులుకొనరె!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

## శ్రీ బలరామశతకము.

సీ. ప్రొద్దుగ్రుంకిన మోము ♦ ముడుచు నబ్జంబని
ఆననాబ్జముఁ జెందు ♦ నళులనంగ
మధుపాళి విసరిన ♦ మాన్పఁ దర్కుండని
ముఖచంద్రుఁ జెందునం ♦ బుజములనఁగ
గగనస్థపతి వియో ♦ గమున కోర్వఁగలేక
వదనేందు నొందు ను ♦ త్పలములనఁగ
తనుకల్పపాదపా ♦ ధర ఫలార్థము వ్రాలు
ఖంజరీటంబుల ♦ కవయనంగ

గీ. మారు నల్లని గల్వక ♦ టారులనఁగ
సోఁగలౌ నీదు కన్గవ ♦ సొగసుఁ జూచి
గోపకాంతలు నినుఁగూడఁ ♦ గోరిరొంర!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

# శ్రీ బ ల రా మ శ త క ము

సీ. రేవతీవాఙ్మధాం ♦ భోవర్ష పరిపూర్ణ
భవ్యతరాచ్ఛ కూ ♦ పములనంగ
ఘ్రాణచంపకరీతి ♦ కదరిడాగంగవి
శాళులు కూర్చిన ♦ గూళులనఁగ
వదన పంకజనేత్ర ♦ వనజసముద్భ్రాతి
కరములౌ తగు సరో ♦ వరము లనఁగ
ఫాలభాగ్యాక్షర ♦ పఙ్క్తికాద్యంత భా
గస్థిత శ్రీవర్ణ ♦ కములనంగ

గీ. పూర్వదృక్కర్ణ దుష్కీర్తిఁ ♦ బోవఁజేసి
వెలయు తావక కర్ణముల్ ♦ వెలఁదులరయ
బేర్మి నేకాంత మిషచేతఁ ♦ బిలతురౌర!
రేవతీరామ! బలరామ! రిపువిరామ

## శ్రీ బలరామశతకము.

సీ. ముఖచంద్రదర్శన ♦ ముకుళిత దీర్ఘాంగ
కృతి భయంకర సైంహి ♦ కేయులనఁగ
ధవళ బాహుసురేంద్ర ♦ దంతిహస్తాకర్ష
రమణీయ తరమక ♦ రంబులనఁగ
లలితాననాంబుజ ♦ లావణ్యమధుపాన
పరినటద్రక్త బం ♦ భరములనఁగ
భూభరణాద్భుత ♦ పూర్ణయశోమూర్తి
కర్ణభూషిత శౌర్య ♦ ఖండలనఁగ

గీ. మెఱయు కురువింద సందోహ♦మిళిత హేమ
కుండలంబుల నీచెవి ♦ కొనలఁ జూచి
మరులుకొనియుండె గోపికా ♦ మండలంబు
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

# శ్రీ బలరామశతకము.

సీ. కాంతారతిజఫాల ♦ ఘర్మహిమేక్షణ
కంజంబులకు నడ్డు ♦ గట్టులనఁగ
స్మరధన్వి దృక్పద్మ ♦ శరములు ఘటియించి
తరుణులనేశాడి ♦ ధనువులనఁగ
తనుపయస్సాగరో ♦ ద్భవ వదనాబ్జయు
క్ఛృంగారకర్దమ ♦ రేఖలనఁగ
ఆననాబ్జశ్రీవ ♦ యస్తంభనిక్షిప్త
రమణీయనింబ ప ♦ త్రములనంగ॥

గీ. బొలుపుఁబుట్టించు తానక ♦ భ్రూయుగంబు
గాంచి మోహించి గోపికల్ ♦ కామబాణ
హతికి నోర్వక పతులపై ♦ మతులు విడరె!
రేవతీకాదు! బలరామ! ♦ రిపువిరామ!

సీ. నిజగంధ మొల్లని ♦ నేత్రాళులను వేడఁ
గోరివచ్చిన హేమ ♦ కుసుమమనఁగ
శుభబీజములుగల్గ ♦ సుముఖస్ఖలితపంబుఁ
బూని చేసెడి తిల ♦ పుష్పమనఁగ
నిజసౌఖ్యమునుజూప ♦ నేత్రసన్నిధినొందు
కాంతాతసీకోర ♦ కంబనంగ
భాసురాధర బింబ ♦ ఫలముఁ బట్టఁగఁ జూపు
చక్కని రాచిల్క ♦ ముక్కనంగఁ

గీ. జెలఁగు తావక నాసికఁ ♦ జెలులుచూడ
వేడుకలతోడ మల్లెల ♦ విరులఁ జూపి
బావగారని బిలతురు ♦ పరిహసింప
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ. ఘనతరామృత సరో ♦ గత పుండరీకస్థ
చారుమేచక భృంగ ♦ చయమనంగ
వదనశశాంకుండు ♦ వైరంబువదలి ని
ల్చిన వసించెడి తమో ♦ రేఖలనఁగ
అధరవిద్రుమ శేష ♦ మధువుఁ గ్రోలఁగ వ్రాలు
విమల మేచక ఖంజ ♦ నములనంగ
ఉత్తరోష్ఠంపు సాన ♦ నుంచి త్రుప్పలు దుల్చి
కందర్పుఁ డిడు సూరె ♦ కత్తులనఁగ

గీ. వెలయు నీమీసములు జూచి ♦ వివిధరిపులు
సమరసన్నాహ సాహసో ♦ త్సాహ ముడిగి
అతులభయమున భూపలా ♦ యితులుగారె!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ. నయనోత్పలంబులా ♦ ననచంద్రుఁ జెందినఁ
జూచి తోఁచక వచ్చు ♦ చుక్క యనఁగ
ఘ్రాణచంపక సుదృ ♦ గ్భ్రమరయుక్తికి నోడి
మ్రొక్కువచ్చిన మల్లె ♦ మొగ్గనంగ
అధరసుధాసమం ♦ బగు నాకోయని దేవ
భీరులుంచిన సుధా ♦ బిందువనఁగ
శచి రేవతులు రుచి ♦ వచనమాధురికైన
దెలియనుంచిన కల్ప ♦ ఫలమనంగ

గీ. మెఱయు తావక నాసాగ్ర ♦ మిళదనర్ఘ్య
మౌక్తికముఁ జూచి గోపికల్ ♦ మన్మథోప
విషదవగతార్థ హృదయులై ♦ నిన్నుఁ గనరె!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ. వల్లవీశుకముల ♦ మెల్లనం జేబట్టం
దలంచి చూపిన బింబ ♦ ఫలమనంగ
అమరీపికాంగనా ♦ సముదయంబున కిచ్చు
చెంగావి మామిడి ♦ చిగురనంగం
బన్నగస్త్రీముఖ ♦ పద్మవిలాస కృ
త్తరుణార్క భాస్కరో ♦ దయమనంగ
రమణీయ రేవతీ ♦ రాగసందర్శిత
విమలారుణా ఛవి ♦ ద్రుమమనంగ

గీ. మెఱయు నీమోవి తేనెల ♦ మించం గ్రోల
దలంచి సేవించు గోలలు ♦ తాళలేక
చేఱకు విలుకాని కోలల ♦ చెఱలం బడరె!
రేవతీకామ! బలరాము! ♦ రిపువిరామ!

సీ. వదనపంకజమందు ♦ వాసించు మధుధార
గ్రోలవచ్చిన తేఁటి ♦ గుంపనంగ
వదనచంద్రుఁడు రోమ ♦ పంక్త్యహి భీతిచేఁ
గాపుబెట్టిన నీల ♦ కంఠమనఁగ
హాసచంద్రికఁజూచి ♦ యదరుచు నలుపెక్కి
వెనుకడాఁగిన తమో♦వి సరమనఁగ
నుదయించఁ దెమ్మెర ♦ కదలించునని శేష
తాజ్ఞతదాఁగు కం ♦ ధరమనంగ
గీ. నీదు సిగఁజూచి మదనుండు ♦ నెమలిరౌతు
చోరవర్గంబు చాతక ♦ స్తోమకంబు
నెదల ముదమంది విస్మయా♦న్వితులుగాఁగ!
రేవతీరామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామ శతకము.

సీ. శివునకుఁ జంద్రుండు ♦ శేఖరంబై యొప్పు
నని భూషణంబైన ♦ యినుఁడనంగ
విరహమోర్వక తామ ♦ విభుశిరంబునఁ జెందు
ఫణిరాజ ఫణమణి ♦ గణమనంగ
గాళింది బెగడొంద ♦ ఘనశిరంబున నుంచు
భూరిహాటక సుమ ♦ పుంజమనఁగ
సకల యోగీశ్వర ♦ సందర్శనీయ శ్రీ
రక్షస్ఫురద్దివ్య తే ♦ జంబనంగ

గీ. వెలయు తావక శీర్షాగ్రి ♦ విస్ఫురత్ప్ర
భావిభాసుర ఘనకుసుం ♦ బ ప్రభాభి
రామమగు పాగ సేవింప ♦ బ్రహ్మతరమె!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ. వదన సుధాసరో ♦ వరమున కొనరించు
హరిమణిని కరమ ♦ యాళియనఁగ
ధవళదేహసురేంద్ర ♦ తరుశిరంబునఁ బట్టు
భాసురంబగు తేనె ♦ పట్టనంగ
సుందర ముఖపద్మ ♦ శోభామరందంబు
భుజియించు షట్పద ♦ పుంజమనఁగ
వల్లవీరమణుల ♦ వలపింపఁ జూపించు
చారుతరంబైన ♦ సవరమనఁగ

గీ. డంబుగల నీదు భవిరగ ♦ డ్డంబుఁజూచి
మతుల మోహించి గోపికా ♦ మండలంబు
కలయఁజూడఁగ! కన్నుల ♦ కఱవుదీఱ
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

## శ్రీ బలరామశతకము

సీ. కాంతామణీ మత్త ♦ కరిణీపరిష్వంగ
గాఢేంద్ర దంతిరా ♦ ట్కరము లనఁగఁ
బ్రబల ప్రబలంబ ప్ర ♦ భంజనాహృతి దక్ష
ఫణిరాజ శీకర ♦ ఫణములనఁగ
పాండురరుచిగాత్రి ♦ భాసురామరశాఖి
చారుతరోన్నత ♦ శాఖలనఁగ
భూరిగోపాంగనా ♦ భుజసమర్పణ యోగ్య
లసమాన కుంభమా ♦ ల్యంబులనఁగ

గీ. వెలయు తావక భుజములు ♦ వెలఁదులెల్ల
లీల సేవించి తావకా ♦ లింగనాది
కార్యతత్పరులై నిన్నుఁ ♦ గనులఁ గనరె!
రేవతీరామ! బలరామ! ♦ రిపువిరామ!

# శ్రీ బలరామశతకము.

సీ. ధగధగద్ధగితమా ♦ ధవళదేహచ్ఛాయ
గంగాప్రవాహ సం ♦ గతిజనింప
తళతళత్తళలాడు ♦ తరుణవళీరుచుల్
విలసత్తరంగాళి ♦ వీలుఁ దెలుప
పరిస్పృన్నిషేవణ ♦ భవఘర్మ బిందువుల్
సొగసైన ముత్యాల ♦ సొంపుఁదెలుప
ఆనాభిబద్ధ నీ ♦ లాంబరము సురన
దీ సంగమయమున ♦ తీరుఁ దెల్ప

గీ. గాంగయామున జలఝరీ ♦ సంగమార్హ
కూపమన నాభిగహ్వరం ♦ బేరుమీఱ
సేమములుగల్గ నాకు నీ ♦ సేవగల్గె!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ. వరనాభి గుహనుండి ♦ వదనచంద్రుని బట్టఁ
బరుగెత్తుచున్నట్టి ♦ ఫణియనంగ
ముఖపద్మమునుజూచి ♦ ముసరి తేనియఁ గ్రోల
జరగి వచ్చిన తేఁటి ♦ జాలనంగ
సేసకొప్పు ఘనంబుఁ ♦ జేరంగఁ బొక్కిలి
గృహము వెల్వడు ధూమ ♦ రేఖయనఁగ
కెమ్మోవి ఖండచ ♦ క్కెరఁ గోరి సేవింపఁ
బరుగెత్తు చీమల ♦ బారనంగ

గీ. కారుకొను నీదు మెఱుఁగు నూఁ ♦ గారుతీరు
దేరిచూచుచు మరుబారుఁ ♦ గోరిమీరి
కేరి నారులు నీదరిఁ ♦ జేరిశౌర!
రేవతీరామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ. కూర్మిచేఁ దలఁ జూపఁ ♦ గోసి వేతురటంచు
మోవిచాటునఁ దాఁగు ♦ మొగ్గలనఁగ,
జేఁ బడ్డ జైజ్జముల్ ♦ జేతురటంచువా
తెఱచాటుదాఁగు ము ♦ త్తైములనంగ,
గనులలోపలనున్నఁ ♦ గనిసానఁ బట్టుదు
రని దాఁ గు వజ్రసం ♦ హతియనంగ,
చిలుకలపోటుల ♦ కులికి నిల్వకదాఁగు
దాడి మబీజ సం ♦ తతి యనంగ,

గీ. బల్కుదురు బల్కుముద్దులు ♦ గుల్కబల్క
గోపికలు కుల్కి నీదు బ ♦ ల్కుదురుఁ జూచి,
బల్కుదురు దానిసాబగెంచి ♦ బల్కుఁ దర మె!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ. వల్లవీ చోరులు ♦ వక్షఃప్రవరణంబుఁ
జేర నెత్తించుని ♦ శ్రేణులనఁగ,
మధ్యమాంబర దేశ ♦ మహిత శుభ్రప్రభా
గంగానదీతరం ♦ గములనంగ,
కాంతామణీకన్య ♦ కలు నాభికాసార
మునఁ గట్టుసోపాన ♦ గణమనంగ
ఆస్యమిందుని దోఁచి ♦ యూరను ఫణరాజు
కడను దాచిన చంద్ర ♦ కళ లనంగ,

గీ. లలితకాంతులఁ దళతళ ♦ లాడునీవు
వళులసేవించి గోపికా ♦ వళులు వళుల
కులికిబడి కోకిలాళుల ♦ కళుకుబడరె!
రేవతీకామ! బలరామ! రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ. రమణీయ పీతాంబ ♦ రంబు తమ్మునకిచ్చి
నీలాంబరంబైతె ♦ నీవుదాల్చి
దరరథాంగమ్ములు ♦ తమ్మున కర్పించి
నిరతంబు నాఁగలి ♦ నీవుబట్టి
ఘనతరంబగు ఖడ్గ ♦ మను జన్మునకొసంగి
నిడుదైన రోఁకలి ♦ నీవుబట్టి
గోపికా బృందంబు ♦ కూర్మి తమ్మునకిచ్చి
యేక పత్నీవ్రతం ♦ బీవుదాల్చి

గీ. దొరతనంబును భాగ్యంబుఁ ♦ దోడుకిచ్చి,
తీర్థముల నెల్ల సేవించఁ ♦ దిరిగి తీవు
పుడమినీవంటి సిరికోర్చు ♦ పురుషుఁ డేడి!
రేవతీకామ! బలరామ! రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

[illegible]. భూరిఫణాంచిత ♦ భూమండలంబెల్ల
తెలిదమ్మిపైనుండు ♦ తేఁటియనఁగ
కైలాస గతనీల ♦ ఘనమన ధవళాత
పత్రస్థ శతమఘో ♦ పలమనంగ
శేషశిరోద్ధృతా ♦ సితచేలకంబన
కలశాబ్ధిగతవిష్ణు ♦ గాత్రమనఁగ
చంద్రమధ్యస్థిత ♦ శ్యామలాంకంబన
గగన ధునీనీల ♦ కమలమనఁగ

[illegible]. బుధులు పొడగని యూహించి ♦ పొగడ నెగడి
పుడమి పడగను నిడుకొని ♦ పూర్వశక్తి
దాల్చి జగముల రక్షించు ♦ తండ్రి వీవె
రేవతీరామ! బలరామ! ♦ రిపువిరామ!

### శ్రీ బలరామశతకము.

సీ. రోమరాజిఫణీంద్రి ♦ ధామమై భూరిగం
భీరదుర్గమవామ ♦ లూరు వనఁగ
గాత్రి గంగాధునీ ♦ గతజలాంతరవర్తి
వర్తుల శుభతరా ♦ వర్తమనఁగ
రమణీదన వ్యాంత ♦ రాజ హంస విహార
సరసమానసపరో ♦ వర మనఁగ
గాత్రాటవీ చర ♦ కందర్ప మదచర
త్కల భబాధనకృత ♦ గర్త మనఁగ

గీ. వెలయుసీనాభి వివరంబు ♦ వెలఁదులెల్ల
జూచి మోహించి తనులోనఁ ♦ జోద్యమనుచుఁ
గౌఁగిటను జేర్చి పరిమళ ♦ కాముకైరి!
రేవతీకామ! బలరామ ! ♦ రిపువిరామ !
7

శ్రీ బలరామశతకము

సీ॥ హిమశైల కందర ♦ తిమిరాంతర స్థిత
ఫణమణి భాసుర ♦ ఫణియనంగఁ
కైలాస గిరిలస ♦ త్కాల ధారాధరో
ల్లసిత సౌదామినీ ♦ లతయనంగ
వరవర్ణినీ చక్రి ♦ వాకినీ బంధన
స్మరధన్వి నిర్మిత ♦ జాలమనఁగ
ఘననాభి వల్మీక ♦ కందర సంజాత
జఘనాద్రి వలనేంద్రి ♦ చాపమనఁగ

గీ. గప్పు తావక కటి తటీ ♦ ఘటిత మేచ
కపట భాసుర కాంచన ♦ కాంచిఁ జూచి
జడిసి కనుమూసి దరిఁజేరి ♦ చనఁగ చెలులు!
రేవతీ కామ! బలరామ! ♦ రిపువిరామ

## శ్రీ బలరామ శతకము.

సీ॥ బృందావనంబున ♦ మందలో విహరింప
లీలనంటినపుష్ప ♦ ధూళి యనఁగ
హృదయాబ్జ పూర్ణమై ♦ యెగసి పైకుఱుకుచు
రంజిల్లు భక్తాను ♦ రాగ మనఁగ
అనుపమ దివ్య దే ♦ హక్షీర వారాశి
సహితశోణ నదీ ♦ ప్రసారమనఁగ
నీలాంబరో పరి ♦ నిర్మ లాంగాంబుద
కమనీయ సాంధ్యరా ♦ గంబనంగ

గీ॥ మెఱయు మొకమూలు దగడనె ♦ మ్మెనఁదొడిగి
వీధికేతెంచు నినుఁ జూచి ♦ వెలఁదులెల్ల
విరులుపైఁ జల్లివలపులు ♦ వెలుపుగొనరె!
రేవతీ కామ ! బలరామ! రిపువిరామ!

# శ్రీ బలరామశతకము.

సీ॥ కందర్ప కర్షక ♦ కాంతి సుధాపూర
పాతిత కలమ గ ♦ ర్భంబు లనఁ గ
కామినీ కుచదుర్గ ♦ కదనావ సరవిశా
లాగ్రిగ వీరకా ♦ హళము లనఁగ
గాత్రిపయోనిధి ♦ గతములై విహరించు
రమణీయ వర మక ♦ రంబులనఁ గ
వివిధాంగ నామనో ♦ విరహా హేతుకదంబ
సముద యానంగ తూ ♦ ణములఁగ

గీ॥ వెలయు తావక జంఘులు ♦ వెలఁదు లరసి
సతత బృందావనా ధ్వసం ♦ చరణ జనిత
మాంద్యములు బాసి శేషత్వ ♦ మహిమగాన రే!
రేవతీ కామ! బలరామ ! ♦ రిపువిరామ

# శ్రీ బలరామశతకము.

సీ॥ నీమోమునకు నోడి ♦ నెల చిక్కె మావిభుఁ
డాలించు మనిమ్రొక్కె ♦ భములనంగ
గమన విద్యకునల్గి ♦ కంఖాణమంపిన
నాశ్రయించిన చిన్న ♦ యంచలనఁగ
తనుకాంతి యొక్కింత ♦ దయసేయుమని కల్ప
తరులు పూజించిన ♦ విరులనంగ
మమ్ముఁజేబట్టి నీ ♦ తమ్ముని సుతునసం
గనిఁబ్రోవుమని మ్రొక్కు ♦ కుందములనఁ

గీ॥ దమ్ములకుఁ దమ్ములగునీప ♦ దమ్ములందు
సొమ్ములనగ్రిమ్ముగోరులం ♦ దమ్ము గన్ను
దమ్ములను గ్రిమ్మ దలఁతు డెం ♦ దమ్మునందు
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ

౮

శ్రీ బలరామశతకము.

సీ॥ తెలుపు మినుకులఁ బో ♦ ల్జిలుకు చక్కని మేను
కలశ పయోరాశి ♦ కలిమిఁ దెలుప
పలుకుల నమృతము ♦ లొలుకు నెమ్మోమంద
ముదయించు జాబిల్లి ♦ కుదురుఁ దెలుప
మల్లెపువ్వుల తెల్పు ♦ మురిపించు భుజములు
సురదంతి కరముల ♦ సొంపుఁ దెలుప
అంద మొప్పఁగ మంద ♦ హాసంబు సురబృద
సుఖకర మధురస ♦ సుధ యనంగ

గీ॥ చారు కంఠంబు సొగసైన ♦ శంఖ మనఁ గ
మంజు లోష్ఠంబు కౌస్తుభ ♦ మణి యనంగ
వెలయు నినుఁజూచి గోపికల్ ♦ వెఱఁగు పడరె!
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

శ్రీ బలరామ శతకము.

సీ॥ గాత్రంబుఁ గని ముని ♦ గణము దాహము దీర
గంగాజల భ్రాంతిఁ ♦ గదలివచ్చు
దేవతాసుందరుల్ ♦ దేహకాంతులు జూచి
కోయఁ జూతురు కల్ప ♦ కుసుమమనుచు
మేనిడాల్ గనుఁ గొని ♦ మీఱి చకోరముల్
చంద్రికళాభ్రాంతిఁ ♦ జరిగివచ్చు
అంగదీప్తిని జూచి ♦ హరి తాను భ్రమనొంది
క్షీరాబ్ధియని నిద్రఁ ♦ జెందవచ్చు

గీ॥ ఇన్నివిధముల వీరలు ♦ కన్నుగవలఁ
గప్పఁ జూచిరి నిన్ను క ♦ న్రెప్పలిడక
తావకాకృతి సేవింపఁ ♦ దరమె నాకు!
రేవతీకామ! బలరామ! రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ సంతతానన చంద్రి ♦ సందర్శనాగత
మహనీయ నక్షత్రి ♦ మాలయనఁగ
ధవళాంగ విలసిత ♦ ధామయామాచ్యాగత
భాసుర రుచిమంద ♦ పఙ్క్తి యనఁగ
వరత నుతుహినాద్రి ♦ వక్షస్తటస్ఫుర
ద్గంగానదీ ఝర ♦ ద్వాద్వ మనఁగ
వనితా సురతకాల ♦ వారుణీసేవన
మ్రిత గళితాభ బిం ♦ దువులనంగ

గీ॥ నముహి తావకవక్షస్థ ♦ లాతిశీత
భూరి మౌక్తికహారంబుఁ ♦ బోలతు లరసి
విరహ వేదనఁ జల్లార్చ ♦ వేఁడుకొనరె!
రేవతీకామ! బలరామ! రిపువిరామ!

## శ్రీ బలరామశతకము.

సీ॥ తను కల్పభుజయు గో♦దార శాఖాచ్యుత
భాసుర మేచక ♦ ఫలము లనఁగ
వల్లవీ జనశుకీ ♦ వ్రాత సంగ్రహ దృష్ట
బహురుచి జాంబవ ♦ ఫలము లనఁగ
వదన పద్మప్రభా ♦ వాసిత మకరంద
పాన చరద్భృంగ ♦ పాళి యనఁగ
రాజ కాంతా మనో ♦ రాజీవ బంధన
లసమాన జాలగో ♦ ళకము లనగ

గీ॥ అలరు తావక వక్షస్థ ♦ లాభిరామ
నీల రుచిదక్ష నలినాక్ష♦ మాలఁ జూచి
గోపికలు గూడి సేవించఁ ♦ గోరి రార!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ

9

సీ॥ ఘన వర్తు లావర్త ♦ కందర్ప సాయక
క్షత వేదనా సహా ♦ స్వాంత యగుచు
నుల్లసిత తాభంగిక ♦ పోల్లోల కలోల
హాస్త సంకల్పితా ♦ హ్వాన యగుచు
సకల జనానంద ♦ జనక సన్మకరంద
వారిజ జాలోప ♦ హార యగుచు
రమణీయ జల చర ♦ ద్విజ హంస సమూహా!
సరస మంజులవాక్య ♦ చతుర యగుచు
గీ॥ సీర శిఖరాతి నిర్భిన్న ♦ తీర యగుచు
జడిసి కాళింది నీపా ♦ దజలజ ములకుఁ
బూజఁగావించి భువిఁబుణ్య♦మూర్తియయ్యె
రేవతీ కామ! బలరామ! రిపు విరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ భూమండలం బెల్ల ♦ భోగంబుపై నిల్పి
దీపించు నీశక్తిఁ ♦ దెలియ లేక
హాల శిఖరంబున ♦ హాస్తి పురంబబ్ధిఁ
గలఁపనెత్తిన శక్తిఁ ♦ గానలేక
జీమూతముల చాటుఁ ♦ జేరిపోరెడి శక్రి
జయునిఁ జంపినశక్తి ♦ సరకు గొనక
జ్వాలదాన నోద్భవ ♦ జ్వలన శిఖాదగ్ధ
సర్వ జగచ్ఛక్తి ♦ సరణిఁగనక
గీ॥ శైలగిరి యెత్తిపట్టెను ♦ గృష్ణుఁడనుచు
నీదు తమ్మునిఁ దలతురు ♦ నిఖిల జనులు
జగతి నీతోడ నతఁడెట్లు ♦ సదృశుఁ డగును
రేవతీ రామ ! బలరామ ! రిపు విరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ వెలఁదిగో మీయింట ♦ విందుఁ జేయఁదలంచి
వేంచేతు నని పాట ♦ విన్న యట్లు
పడఁతిరో నీశయ్యఁ ♦ బవళింప విచ్చేతుఁ
బదిలముండు మటంచుఁ ♦ బాడినట్లు
సుదతిరో నీతోటి ♦ సాగటాల పాచిక
లాఁడుదు నని పాటఁ ♦ బాడినట్లు
సఖియరో నీతోటి ♦ సఖ్యంబుఁ గావింతుఁ
బరుగున రమ్మని ♦ బాడినట్లు
గీ॥ నుండెనీవేళయని సఖి ♦ మంకలంబు
ప్రేమ నుప్పొంగి యుబ్బి త ♦ బ్బిబ్బుగాఁగ
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు
రేవతీ కామ ! బలరామ !♦ రిపు విరామ

సీ॥ దేవతాసుందరుల్ ♦ దేహవిస్మృతినొంది
వలరాజు శౌరుకు ♦ వలసిచూడ
ధేనువుల్ తనువులు ♦ దెలియక మేతలు
మాని వీనులు జాపి ♦ మరగి వినఁగఁ
దల్లుల చనుబాలు ♦ దాగ్రివుచు లేఁగలు
చాలించి చెవులొగ్గి ♦ సంతసింపఁ
బతుల శయ్యలమీఁదఁ ♦ బవళించి వారల
మఱపించి నెలఁతలు ♦ మరులుకొనఁగ

గీ॥ బసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాదముంచి
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి
బ్రహ్మ గాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు
రేవతీ కామ ! బలరామ! రిపువి రామ!
10

## శ్రీ బలరామశతకము.

సీ॥ కైవల్యలోక సం ♦ ఘటితుండ నేనని
పేర్మితో యోగులఁ ♦ బిలిచినట్లు
పాతాళ ముఖలోక ♦ భరణాఢ్యు నే నని
దిగ్గజంబులతోడఁ ♦ దెలిపినట్లు
ముక్తులఁ దోడ్కొని ♦ మోదంబుఁ గావింతు
లెమ్మని జెన్నుని ♦ లేపినట్లు
పరిపంథి రాక్షస ♦ భంగంబు గావించి
పాలింతు మిమ్మని ♦ పలికినట్లు

గీ॥ పసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాదముంచి
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ రావె సుందరి నీవు ♦ రమ్యవంశీ నినాద
మాలించి పడి వత్తు ♦ మనుచుఁబిలువఁ
గనవె కన్నరో నేఁడు ♦ ఘన మురళీనాద
మానంద మొందించు ♦ నని దలంప
లేవె పిల్లనగ్రోవి ♦ లేఁత గీతము మది
కింపగు నని బోటు ♦ లిట్లు వలుక
రావెలందిరో వేణు ♦ రావంబు చెవులకు
విందు సేయునటంచు ♦ సందిడింపఁ

గీ॥ బసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాద మ్మూంచి
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

సీ॥ కఠిన శైలంబులు ♦ కరగిఁ భూములనిండి
కాలువలై యబ్ధిఁ ♦ గలయుచుండ
సకల మహీరుహ ♦ సందోహ మెల్లను
బదపడి వనములఁ ♦ బల్లవింప
నిఖల పయోధర ♦ నికరంబు మెల్లన
వెఱఁగంది మల్లెల ♦ విరులు గురియ
సర్వ సర్వంసహా ♦ చక్రస్థితజనంబు
లచలత్వ మొందుచు ♦ నధివసింపఁ

గీ॥ బసిఁడి డాకాలిపైఁగుడి ♦ పాదముంచి
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు
రేవతీ కామ !బలరామ ! ♦ రిపువిరామ!

సీ॥ సుందర మందార ♦ సుమ వాసనాయుత
మంద మారుతములు ♦ మసలి నట్లు,
కర్పూర పరిమళ ♦ కలిత శీతలవారి
సారె సారెకు మేనఁ ♦ జల్లి నట్లు,
శరదిందు శీతకర ♦ జాతవర్షితసుధా
ధారలు మేనులఁ ♦ దడిపినట్లు,
సారసోత్పల కుంద ♦ సరస మరందంబు
కాలువలై మేనఁ ♦ గ్రిమ్మి నట్లు,
గీ॥ పసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాద ముంచి,
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువి రామ!

11

శ్రీ బ ల రా మ శ త క ము.

సీ॥ ధవళ చేలంబులు ♦ ధరియింప కధరించి,
తొడవులు తొడుగక ♦ తొడిగి తొడిగి,
నీల నీరాడక ♦ నీరాడి నీరాడి,
జుట్టక పాల్పువ్వ ♦ జుట్టి జుట్టి,
నిజ గృహంబుల నిల్చి ♦ నిలువక నిలువక,
పువ్వులు ముడువక ♦ ముడిచి ముడిచి,
తుటుములఁ బైదువ్వి ♦ దువ్వక దువ్వక,
కప్పక పయ్యెదల్ ♦ గప్పి కప్పి,
గీ॥ చేతు లాడక తడఁ బడి ♦ చెలులు వినఁగఁ,
నధరసుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రిహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

సీ॥ చెలులను జెఱఁబట్టఁ ♦ జెఱకు విల్ జేఁబట్ట
గావంచి, జమలిము ♦ క్కాలిఁగూర్చి,
నెత్తమ్మి దూపుల ♦ నిండి తాజిల్లెడు
దొనల భుజంబులఁ ♦ దోడుబఱచి,
పలుకులఁ దే ఁ ♦ లొలుకు జిల్కులఁ జిల్క
సిరి మించియొప్పారా ♦ చిల్క నెక్కి,
విరిగల్వ దూపుల ♦ వింట వేగమొనర్చి,
మదనుఁడు నెలఁతల ♦ మరులు గొలుపఁ
గీ॥ బసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాదముంచి
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ! బలరామ! ♦ రిపువిరామ!

## శ్రీ బలరామశతకము.

సీ॥ సకల చరాచర ♦ జంతు బీజంబైన
పరుఁడు కృష్ణుండని ♦ పాడినట్లు,
హరి భువనైశ్వర్య ♦ కరకటాక్షము నొప్పు
పద్మరుక్మిణియని ♦ పాడినట్లు,
సర్వజగద్భార ♦ శక్తిసంపన్నుఁడౌ
ఫణిరాజు నేనని ♦ పాడినట్లు,
మాధవాధరసుధా ♦ మాధుర్య కాముకా
ప్సరలు గోపికలని ♦ పాడినట్లు,

గీ॥ పసిఁడి డాకాలిపైఁగుడి ♦ పాదముంచి,
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ మహనీయ తపనీయ ♦ మయ లతాంతర దేశ
సంజాత కల్పభూ ♦ జంబనంగ,
కమనీయ తారకా ♦ గణ మధ్య మాంచిత
చ్ఛవిసంస్ఫుర త్పూర్ణ ♦ చంద్రుఁడనఁగ,
మహిత తటిల్లతా ♦ మండలాంతర దృష్టి
లసమాన రూపకై ♦ లాసమనఁగ,
కందర్ప కలహార్థి ♦ కరిణీ గణాంతర
ధవళ ప్రభామర ♦ దంతియనఁగ,

గీ॥ వల్లవీసుందరులమధ్య ♦ వన్నెకెక్కి,
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి
బ్రహ్మ గాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ! రిపువిరామ!

12

సీ॥ ఒకకొమ్మ కెమ్మోవి ♦ నుండు తేనియఁగ్రోలి,
యొకలేమ చన్గవ ♦ యొత్తిపట్టి,
ఒకయింతి కెదురుగా ♦ నొలసి కన్గవఁగీఁటి,
యొకభామపైఁగోప ♦ మొదవదుడికి
ఒకచెలి ధమ్మిల్ల ♦ మొనరఁ జేసులఁబట్టి,
యొకసఖిఁ గౌఁగిట ♦ నొప్పఁగూర్చి,
ఒకవన్నెలాఁడితో ♦ నుప్పొంగి వేఁడ్డి,
యొకయింతితో తేనె ♦ లొల్కఁబల్కి,

గీ॥ పసిఁడి డాకాలిపైఁగుడి ♦ పాదముంచి,
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ॥ షడ్జస్వరశ్రుతి ♦ సాధ్వసంబునఫణుల్
శీఘ్రంబుపుట్టలఁ ♦ జేరిడాఁగ,
సరస నిషాదంబు ♦ సంతోషమునవిని
కరిణీకదంబంబు ♦ కదిసిచూడ,
సాదుతరర్షభ ♦ స్వరములఁ జెవులొగ్గి
గోవులుసేవించిఁ ♦ గోరఁగాఁగ,
పంచమస్వరముల ♦ పాటవంబాలించి
పరభృతంబులు ప్రీతి ♦ ధ్వనులుసేయఁ,
గీ॥ బసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాదముంచి
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

## శ్రీ బలరామ శతకము.

సీ॥ నవనవమాధుర్య ♦ నాదామృతస్యంది
సుషిరాళిపై వ్రేళ్ళు ♦ సొంపొనర్ప,
భువనమోహనలస ♦ ద్భ్రూవిలాసముజూపి,
వామభాగంబున ♦ వదనముంచి,
సకలగోపీజన ♦ స్వాంతముల్ గరఁగించి,
మందహాసంబను ♦ మచ్చుజల్లి,
భాసురవారుణీ ♦ పారవశ్యంబునఁ
గనుదమ్ములించుకఁ ♦ గదలమూసి,

గీ॥ పసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాద ముంచి,
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ! బలరామ! రిపువిరామ!

## శ్రీ బలరామశతకము.

సీ॥ మహితబృందావన ♦ మందారలతలెల్ల
మదన వేదనశుభ్ర ♦ మహిళ లనఁగ,
మధుకప విచికిల ♦ మకరందధారలు
గానజానందాశ్రు ♦ కణములనఁగ,
శుభ్ర ప్రభాంచిత ♦ సుమనికుగుంబంబు
హలధరాలోకన ♦ హాసమనఁగ,
భాసుర సుమచర ♦ ద్భ్రమరీ నినాదంబు
కలిత తావకకథా ♦ గాన మనఁగ,

గీ॥ వెలయు బృందావనంబున ♦ వెలసి వెలసి,
యధరసుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ! బలరామ! ♦ రిపువిరామ!
13

## శ్రీ బలరామ శతకము.

సీ॥ కల్యాణిలోఁ జూపు ♦ కలమధుర ధ్వనుల్
రతిరాజు శింజినీ ♦ రవము లనఁగ,
సావేరిలోఁ జూపు ♦ సరసగానంబులు
కమనీయ సితకర ♦ కరము లనఁగ,
రేగుప్తిలోఁ జూపు ♦ రిగప స్వరంబులు
శిత మంద మందమా ♦ రుతములనఁగ,
భైరవిలోఁ జూపు ♦ పంచమ స్వనములు
రమణీయ కోకిల ♦ రవములనఁగ,

గీ॥ వెలయు నీ వేణురవములు ♦ వినుచు నెలఁత
లలరు విలుకాని కోలల ♦ కదిరి పడఁగ,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ రామ! బలరామ! ♦ రిపువిరామ!

సీ॥ ఎంతపుణ్యముఁ జేసె ♦ నీవంశమిలలోన
శార్ఙ్గహస్తమునందు ♦ శార్ఙ్గమయ్యె!
నెంతకీర్తివహించె ♦ నీవేణువవనిలోఁ
బద్మాక్షుదోనలొంది ♦ బాహులెక్కె!
నెంతభాగ్యమునొందె ♦ నీవంశనాళంబు
రామకృష్ణాధర ♦ రసముఁ గ్రోలె!
నెంతసౌఖ్యమునొందె ♦ నీవేణుగుల్మంబు
కేశవవిశ్రాంతి ♦ గేహమయ్యె!

గీ॥ ననుచు గోపికలా వేణు ♦ వభినుతింప
నధర సుధ  వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

## శ్రీ బలరామశతకము.

సీ॥ అగ్నిసాక్షిగ వివా ♦ హమునొందు రేవతి
పేర్మిసన్నిధినున్న ♦ భీతిలేక,
తలిదండ్రులకుఁ దెల్పి ♦ దండింపఁ జూచెడి
పరులఁజూచెదరన్న ♦ బాధలేక,
పాలుపెరుగులుబోసి ♦ బలునిమచ్చికఁజేయు
మనము చూతుమటన్న ♦ మాటలేక,
అనని రేయునఁబవ ♦ లన్ననీమములేక
ముదమొప్పవినువారి ♦ మోహఁబెట్టి,
గీ॥ మురళిబలభద్రు నధరంబు ♦ ముట్టి మ్రోసె
నంతగయ్యాళియనికాంత ♦ లెల్లఁ బలుక,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవ్ర!
రేవతీ కామ ! బలరామ ! రిపువిరామ!

సీ॥ విజనస్థలంబును ♦ నెదకిచూచితెకాని
యన్నప్పుడలవడ ♦ దధరరసము,
ఏకాంతమందు ని ♦ రీక్షించితేఁ గాని
కరపంకజస్పర్శ ♦ కలుగదెపుడు,
అతిరహస్యాగార ♦ మందునిల్పితెకాని
ఘనకుచస్పర్శలు ♦ గలుగవెపుడు,
ప్రచ్ఛన్నదేశంబు ♦ భావించితేఁ గాని
హాలిముఖదర్శనం ♦ బందకుండు,

గీ॥ అన్నియును దీనికగునని ♦ యబలలెంచ,
నధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ! రిపువిరామ!

# శ్రీ బలరామశతకము.

సీ॥ నారదవల్లకీ ♦ నవ్యరసామృత
మాధురీఝురముల ♦ మఱపుఁ జూపి,
భారతీపదపద్మ ♦ భాసురమంజీర
శింజారవంబులఁ ♦ జిన్నవుచ్చి,
కిన్నరీకరపద్మ ♦ కిన్నెరరవబృంద
మకరందధారల ♦ మందలించి,
గోవిందమందిర ♦ కోవిదసందోహ
సామగీతంబులఁ ♦ జప్పబఱచి,

గీ॥ పసిఁడి డాకాలిపైఁగుడి ♦ పాదముంచి,
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బ ల రా మ శ త క ము.

సీ॥ బలమధురాధర ♦ పానమాధురిఁ బట్టి
మహి వేణుగానంబు ♦ మధురమయ్యె,
ముసలభృన్ముఖమరు ♦ త్పూర్ణశైత్యంబున
సరసవేణురవంబు ♦ చల్లనయ్యె,
శేషాంశబలశయ ♦ శ్లేషవశంబునఁ
జనురవంశరవంబు ♦ శ్లాఘ్యమయ్యె,
అచ్యుతాగ్రజ మనో ♦ హరగాన రసమున
మురళి గీతము జగ ♦ న్మోహమయ్యె;

గీ॥ ననుచు గోపాంగనామను ♦ లభినుతింప
నధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రిహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

శ్రీ బ ల రా మ శ త క ము.

సీ॥ సుందరాలంకృత ♦ చూతపల్లవములు
కామినీ మోహాంత ♦ కరములనఁగ,
నిఖిలలాంగ భూక్షిప్త ♦ నీలోత్పలంబులు
సకల గోపీవిలో ♦ చనము లనఁగ,
వక్షోవిభూషిత ♦ వనజమాల్యంబులు
మోహావిన్యస్తాళి ♦ ముఖములనఁగ,
మహితభుజాకల్ప ♦ మాయూరపింఛముల్
కాంతామణిన్యస్త ♦ కచములనఁగ,

గీ॥ పసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాదముంచి
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

సీ॥ కుబ్జ తమ్మునిఁ గోరి ♦ కొని రమించెనుగాని
బలభద్రుని నధరంబుఁ ♦ బట్టఁ గలదె,
గోపికల్ మోహించి ♦ కోరి చూచుటెకాని
హాలి యధరామృతం ♦ బానఁ గలరె,
రేవతి సమయంబు ♦ లెక్కించుటేకాని
యధర మహర్నిశం ♦ బందఁగలదె,
బలుహస్త పద్మంబుఁ ♦ బట్టి యుండుటెకాని
ముసల మయ్యధరంబు ♦ ముట్టఁగలదె,

గీ॥ యనుచు వంశంబు మ్రోసెనో ♦ యనితలంప
నధరసుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ ! బలరామ ! రఘువిరామ!

15

## శ్రీ బలరామశతకము.

సీ॥ వనితావి మోహన ♦ వంశనినాదంబు
సరస విలాసగ ♦ ర్జనమనంగ,
ప్రమదా విలోకన ♦ భవమందహాసంబు
లలిత సౌదామినీ ♦ లతయనంగ,
మస్త కోపరిలస ♦ న్మాయూర పింఛంబు
చారు సునాశీర ♦ చాపమనఁగ,
నబలా గతా కటా ♦ క్షామృత వర్షంబు
విమల శీతోదక ♦ వృష్టి యనఁగ,
గీ॥ మెఱయు నీవను మేఘంబు మిగులఁజూచి,
వల్లవీ చాతకీ గణ ♦ మెల్ల లేచి,
కోరి యధరామృతాంబువుఁ ♦ గ్రోలఁజూచు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ !

శ్రీ బలరామ శతకము.

సీ॥ ఘనతరాధర సుధా ♦ కామినీ చుబుకముల్
పుణుకుచు లాలించి ♦ బుజ్జగించి,
యనవరతాలింగ ♦ నాసక్త సుందరీ
కఠిన కుచంబులఁ ♦ గౌఁగిలించి,
మధుర వాక్ప్రవణార్థ ♦ మాని నీసందోహ
చిత్తముల్ గరఁగించఁ ♦ జతురులాడి,
కందుక క్రీడాభి ♦ కామ కామినులతో,
బద్మ మంజరులచే ♦ బంతు లాడి,

గీ॥ పసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాదముంచి,
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ అనుజుండు గోపికా ♦ ఘన భుజంగముడందు
గుర్వి నీతఁడెభుజం ♦ గోత్తముండు,
అనుజుని మధుహరుం ♦ డని మ్రొక్కుచుందురు
మతి నెంచనీతఁడె ♦ మధుహరుండు!
అనుజుని పుండరీ ♦ కాక్షుఁ డటందురు
వీక్షింపపుండరీ ♦ కాక్షుఁ డితఁడె!
ధరణిఁ దమ్మునిఁ జక్రి ♦ ధరుఁడని కొల్తురు
భావింప భూచక్రి ♦ ధరుఁడితండె!

గీ॥ యనుచు నినుఁజూచి గోపిక ♦ లభినుతింప
యధర సుధ వేణు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ! బలరామ ! ♦ రిపువిరామ!

సీ॥ కచబంధముల్ వీడఁ ♦ గాఁడిఁ గెలల్లాడ
కర కంకణంబులు ♦ గలసి మ్రోయఁ,
పైఁటకొంగులు జాఱఁ ♦ బాదముల్ తడఁబడ
సొగసైన హారముల్ ♦ నూడి వడఁగ,
మొలనూలు విడివడ ♦ ముక్తామణుల్ రాల
మోమునఁ జిరునవ్వు ♦ మొలకలెత్తఁ
గంచు కంబులువీడఁ ♦ గాళ్లమట్టెలు మ్రోయ
నలసతఁ జన్దోండ ♦ లదిరిపడఁగ

గీ॥ బరుగులిడివచ్చి గోపికల్ ♦ మరులుకొనఁగ
ముద్దుతమ్మునితోఁ గూడి ♦ మోహబెట్టి,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

16

## శ్రీ బలరామశతకము.

సీ॥ ఘనతర మందార ♦ ఖర్జూర జంబీర
ఘనసార పనసవృ ♦ క్షములక్రింద,
సుందరతరకుంద ♦ సుమ బృందవాసిత
నవనవకాయమా ♦ నములక్రిందఁ,
జారుసారసచర ♦ చంచరీక కదంబ
రమణీయ పద్మాక ♦ రములక్రింద,
మంజుల శుకపిక ♦ మధుర వాఙ్మకరంద
ఝరలసమానకుం ♦ జములక్రిందఁ,

గీ॥ పసిఁడి డాకాలిపైఁ గుడి ♦ పాదముంచి,
యాధర సుధ వేఁసు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ!

# శ్రీ బలరామశతకము.

సీ॥ ఏమినోములు నోఁచె ♦ నోముసలంబిల
సిరిమించు బలభద్రుఁ ♦ జేట్టఁబట్టె,
ఎట్టితపంబులు నెలమి గావించెనో
భువిహాలంబీహాలి ♦ భుజముఁబట్టె,
ఎట్టిపుణ్యంబులు బట్టి రంజిల్లెనో
మెకపటే వాసియు ♦ మేనుముట్టె,
ఎట్టి పూజలుజేసె ♦ నీవేణు సుందరి
హాలి యధరామృతం ♦ బౌనుచుండె,

గీ॥ ననుచు భువి గోపసుందరు ♦ లభినుతింప,
నధర సుధ వేణుసుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీ కామ! బలరామ ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ విలుకాఁడ నేనని ♦ వృత్తంబు చాటొగ్గి,
వాడిఁ శరంబున ♦ వాలిఁ జంపెఁ,
గామితార్థములిచ్చు ♦ ఘనుఁడ నేనని తెల్పి,
కోరిరక్కసి ముక్కుఁ ♦ గోసివేసె;
వటుఁడునై బలిచక్రి ♦ వర్తిని భ్రమఁబెట్టి,
భువనత్రయముఁ గొల్చి ♦ పుచ్చుకొనియె,
స్వపదభక్తిని మించు ♦ త్రిపుర దైతేయుల
భంగింప శివునకుఁ బాణమయ్యెఁ,

గీ॥ దమ్ముఁడే నాడు మాయలఁ ♦ గ్రమ్ముకుండె,
నాతని మాయల దాఁటింపఁ ♦ జతురుఁడీతఁ
డనుచు గోలలు నీపాట ♦ లాడుకొనరె!
రేవతీ కామ! బలరామ! ♦ రిపువిరామ!

### శ్రీ బలరామ శతకము.

సీ॥ సమర రంగాహిత ♦ సాధ్వసధ్వనియగు
శంఖంబునకు మృదు ♦ స్వనముగలదె!
బలు సనాయిలలోనఁ ♦ బల్కు పల్కుల కెల్ల
సరసంపులేఁ దీపి ♦ చవులుగలవె!
కదన జయస్వన ♦ కాహళంబుల కెల్ల
రమణీ విమోహన ♦ రవము గలదె!
ఘనమృదుస్వనమృదం ♦ గంబున కే వేళ
మునిజన మోహన ♦ స్వనముగలదె!
గీ॥ యనుచు వంశంబు మోపిసినో ♦ యనితలంచ
నధరసుధ వేణుసుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడి తీవు!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ వల్లవీకరపద్మ ♦ వల్లకీరవములు
మురళీరవంబుల ♦ ముచ్చట్టింపఁ,
గలితగోపికడింభ ♦ కరతాళరవములు
కలవేణురవములఁ ♦ గలసిమెలఁగఁ,
బన్నగసుందరీ ♦ పఠితగీతంబులు
మృదువంశగీతముల్ ♦ మేళగింప,
మల్లికాసుమచర ♦ మధుపస్వనంబులు
వేణుస్వనంబుల ♦ వియ్యమొంద,
గీ॥ ముద్దుతమ్మునితోఁ గూడి ♦ మోహపెట్టి,
యధరసుధ వేణుసుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ!

# శ్రీ బలరామశతకము.

సీ॥ మాధ్వీక మృద్వీక ♦ మందార ఫలముల
దరిలేని తీపులు ♦ తారసిలఁగ,
వామాంకసంస్ఫుర ♦ ద్వనితాధరామృత
సారముల్ జిల్కు వా ♦ చవులఁజూపఁ,
కరయుగాలింగిత ♦ కాంతాశిరోమణి
చన్దోయి చాలము ♦ చ్చటలుగాఁగ,
వాణీమనోహార ♦ వల్లకీ వల్లరీ
రవములువలె మధు ♦ రసములొలుక,
గీ॥ ముద్దు తమ్మునితోఁగూడి ♦ హూహా బెట్టిఁ,
యధరసుధవేఁడు సుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామ శతకము.

సీ॥ పంచోపనిషదాఖ్య ♦ పర్వంబులను బాడి,
పరిణతస్వరంబులఁ ♦ బరఁగనూఁది,
శ్రీవిష్ణుపాదాబ్జ ♦ చింతన మొనరించి,
యిందిరామణి కిధ ♦ రెల్లనూఁది,
భువనత్రయాకృతిఁ ♦ బూన్చి చిత్రములోన
ముదమొప్ప మూర్తుల ♦ మూఁడుఁ బాడి
పంచాయుధంబుల ♦ పదముల వాయించి,
శ్రీనివాసబ్రహ్మ ♦ సేవఁ జేసి,

గీ॥ పసిఁడిడాకాలి త్రైఁ గుడి ♦ పాదముంచి,
యుధరపధ వేణుమందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు !
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

## శ్రీ బలరామశతకము.

సీ॥ కొందఱు గోపికల్ ♦ కూర్మితో వాయించు
సరస మృదంగముల్ ♦ సందడింపఁ,
గొందఱాభీరులు ♦ కొమరొప్ప వాయించు
చిఱుతాళముల మ్రోఁత ♦ చెలఁగుచుండఁ,
గొందఱు వల్లవుల్ ♦ కోరికవాయించు
వల్లకీరవముల ♦ జల్లులొప్పఁ,
గొందఱు గాయకుల్ ♦ కోమలభరతర
సోల్లాసశబ్దము ♦ లుగ్గడింప,
గీ॥ ముద్దుతమ్మునితోఁ గూడి ♦ మోహబెట్టి,
యధరసుధ వేణుసుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడి తీవు !
రేవతీరామ ! బలరామ ! ♦ రిపువిరామ

18

శ్రీ బలరామశతకము.

సీ॥ బహువిధస్ఫురితాస్య ♦ పద్మహస్తసరోజ
పాదాబ్జ విన్యాస ♦ పటిమఁజూప,
సమపాదవలితనై ♦ శాఖ గతాగత
వినివర్తిత స్థాన ♦ విధులనిలచి,
ఘటితమర్దితపాశ ♦ గపక్షిముఖంబుతోఁ,
బాదభేదక్రియల్ ♦ పట్టు పఱచి,
లలితకుంచిత ముకు ♦ శపక్షిముఖంబుతోఁ
దెలిదమ్మిచూడ్కులఁ ♦ దేజరిల్ల,
గీ॥ ముద్దుతమ్మునితోఁగూడి ♦ మోహపెట్టి,
యధరసుధ వేణుసుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మగాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు !
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

శ్రీ బలరామశతకము.

సీ॥ గానము వినవచ్చు ♦ కాకోదరంబులు
బర్హిపింఛముఁ జూచి ♦ పరుగులిడఁగ,
గీతంబు వినవచ్చు ♦ కేసరులమందలు
పులిగోరులనుజూచి ♦ భువిచలింప,
వర నిషాదమువిని ♦ వచ్చు గజంబులు
సింహామ ర్త్యముజూచి ♦ చెదరిపోవఁ
పంచమం బాలింపఁ ♦ బైవచ్చు పికములు
రామ నామశ్రుతి ♦ రయముకదర

గీ॥ బసిఁ డిడాకాలి పైఁగుడి ♦ పాదముంచి,
యధరసుధ వేణుసుందరి ♦ కందియిచ్చి,
బ్రహ్మ గాంధర్వగీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీ కామ ! బలరామ ! ♦ రిపువిరామ !

## శ్రీ బలరామశతకము.

సీ॥ గోపాలగాఁ డని ♦ కోరిపిల్తురు గాని,
పరుఁశని మన్నించి ♦ పలుకరైరి;
కృష్ణమ్మగాఁడని ♦ కేరి చూచిరి కాని,
యిందిరాధిపుడని ♦ యెఱుఁగరైరి;
అతిజారుఁడని లోకు ♦ లపహసించిరికాని,
భువినస్ఖలితుఁ డంచు ♦ బోల్పరైరి;
గారడీవాఁడని ♦ కల్తనొందిరికాని,
నారాయణుఁడని ♦ నమ్మరైరి;
గీ॥ పామరులఁ దెల్పి నమ్మించ ♦ బ్రహ్మతరమె!
యనుచు వంశంబు మ్రోసెనో ♦ యనితలంప,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ!

సీ॥ శ్రీరమామాధవ ♦ సేవాధిగతసాధు
నిరవధికానంద ♦ భరముఁబాసి,
పంచశతాప్సరో ♦ భామినీకరపద్మ
వీణారవంబుల ♦ వినికి బాసి,
కుముద విష్వక్సేన ♦ కుముదాక్షవామన
గరుడాది సూరి సం ♦ ఘములఁ బాసి,
చారురత్న సహస్ర శాతకుంభస్తంభ
భాసురమణిమంట ♦ పంబుఁబాసి,
గీ॥ పరమపదమంత విడనాడి ♦ ఫణివరుండు,
హరిని దమ్మునిగావించి ♦ యఖిలజనులఁ
బ్రోవ నుదయించె నీతఁడే ♦ భువినటంచు,
మోప్రెసెనీ వేఁణువనిజను ల్మోదముఁ జెంద
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు!
రేవతీకామ! బలరామ! రిపువిరామ!

19

## శ్రీ బలరామశతకము.

సీ॥ హరితల్పభూతుఁడై ♦ యలరారనంతుండు
బంగారుతొట్టెలోఁ ♦ బవ్వళించె!
వేయుశిరంబుల ♦ విలసిల్లు భోగీంద్రుఁ
డేకశిరంబున ♦ నింపొసంగెఁ!
బడగలపై భూమి ♦ భరియించు శేషుండు
లలితజల్తారు కు ♦ళాయిఁ బెట్టె!
శాస్త్రశబ్దంబుల ♦ సరణిఁ దెల్పినభోగి
మానినుల్ నగ ముద్దు ♦ మాటలాడె?

గీ॥ ననుచు మునిజను లద్భుత ♦ మందిచూడఁ,
బణఁతులందఱుఁ జోకొట్టి ♦ పాటలాడఁ,
బోసువిడఁ గల్లనిద్దుర ♦ పోతివీవు !
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ!

సీ॥ వల్లవీ జనులను ♦ వరుసతోఁ గూర్చుండ
సాగించి విదలించి ♦ జంగిలాడి,
తమ్మునిఁ దల్లిగాఁ ♦ దలఁచి నియోగించి
ముద మొప్పదాఁ గుడు ♦ మూత్రలాడి,
గోపబాలురతోడఁ ♦ గూడి బారులు దీర్చి
గుడుగుడనుచుఁ జెడు ♦ గుడులుగూయ
గోపికల్ కవ్వించి ♦ కుసుమముల్ మెయిఁజల్లఁ
గూరిమితోఁ గుంది ♦ కుంటులాడి,

గీ॥ జడలఁ జేఁ బట్టి, కొప్పులఁ ♦ జక్కఁబట్టి,
వీపులను గొట్టి, పయ్యెద ♦ వైపుముట్టి,
బ్రహ్మగాంధర్వ గీతంబుఁ ♦ బాడితీవు !
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

శ్రీ బలరామశతకము.

సీ॥ తనదు కూఁతొడ్డును ♦ దగిలి లాగినదని
సూర్యుండు పరుగెత్తఁ ♦ జూచుచుండె!
ఇంద్రుండు తనవంశ ♦ జాతధర్మజపురి
బెల్లెత్తినదటంచుఁ ♦ డెల్లపోయె!
శుక్రుండు తన శిష్య ♦ చక్రిహారియటంచుఁ
గడుభయంబున నొంటి ♦ కంటఁజూచెఁ!
జక్రాయుధాగ్రజ ♦ శయగతంబని రాహు
వదరి నాలుక వెళ్లఁ ♦ గనుపుమండె!

గీ॥ నమరుల నిమిషులై చిత్రి ♦ మనుచుఁ జూడఁ,
గాలచక్రంబు గిరగిరఁ ♦ గదలుచుండ,
నీవు హాలమెత్తి సేవింప ♦ నెవరి తరమొ!
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

సీ॥ యోధులౌ భీమదు ♦ ర్యోధనులిద్దఱు
నతివైరమున మహా ♦ హవమునందుఁ
దలలచే ఢీకిఢీకి ♦ సలిపి,ముష్టాముష్టిఁ
గూడి,బాహాబాహిఁ ♦ గొనుచుమిగులఁ
గోపముననుబండ్లు ♦ గొంటికి, కేశాకేశి
జేసి,పెన్గదలను ♦ దూసి,పోరు
తరిని భీముఁడు దా న ♦ ధర్మయుద్ధమునోడఁ,
బడి,పగతుని తొడఁ ♦ బడఁగఁదనదు

గీ॥ గదను మొత్తంగనీవది ♦ గనిహాలమున
నతనిపుఱెఁగడలిఁగలుపు ♦ దని యనజుని
మదికి వెరచితి కాకున్న ♦ మరియుఁగలదె!
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ !

20

## శ్రీ బలరామశతకము.

సీ॥ మదముతో ముష్టిక ♦ మల్లుండు చెలరేఁగి,
సవరించి కోరమీా ♦ సములుదువ్వి
కాలుదువ్వి, యవని ♦ కదలఁ దారాపథ
మండలంబు పగుల ♦ మల్ల జరచి,
హుమ్మని కదియఁగో ♦ పమ్మునమీార లి
రువురు దద్దఱిలక, ♦ రోసమొదవ
కరికరివలె గిరి ♦ గిరివలె హరిహరి
వలెఁగదిసి మెరసి ♦ బలిమిమీాఱి

గీ॥ మీాఱి తాఘుచుమిగులంగఁ ♦ బోరిపోరి
సాముగరిడీలఁగడతేఱు ♦ సమయమునను
వాని వధియించితీవెకా ♦ వసుధలోన !
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ!

శ్రీ బ ల రా మ శ త క ము.

సీ॥ రోహిణికి జనంది ♦ బాహుబలంబున
నల జరాసంధుని ♦ కలహమందు
నాగలిఁ జేఁబట్టి ♦ నగనిభేభంబుల
శిరముల దునుమాడు ♦ తఱిని,బెద్ద
కడుపులుగలిగిన ♦ వడిరౌతులను మొండె
ముల్వ్రీడఁబడఁ జేయు, ♦ నవియువాయు
వేగమునను నభో ♦ వీధికి నెగసియుఁ
గలసియు రణరంగ ♦ కౌశలమును
గీ॥ నడిగ నిర్విఘ్న మొనరింప ♦ వచ్చినట్టి
బహువినాయకవర్గంబు ♦ పగిదిఁదోఁచఁ,
జూచువారల కత్యంత ♦ చోద్యమయ్యె!
రేవతీకామ ! బలరామ ! ♦ రిపువిరామ!

శ్రీ బలరామశతకము.

సీ॥ తొల్లి మోసంగుల ♦ దొర తమ్మిగొలనిలో
దిగి.నీళ్ళుద్రావఁగ ♦ డఁగుతటిని మ
కరిమోచి తుండంబు ♦ గట్టిగాఁబట్టి, వి
సరిపెచ్చు పెరిఁగినఁ ♦ గరి యిసుమలఁ
బడి గెల్వఁజాలక ♦ పద్మనాభా! పాహి!
పాహి! యనుచుతన ♦ బలిమివిడిచి,
తా మొఱలిడవిని ♦ దయ గటకటఁబడి,
చాలఁగాఁగినిసి, చ ♦ టాలఁజుట్టు

గీ॥ నాలుబట్టి మొసలితలఁ ♦ దూలఁగొట్టి,
కాచిచేబట్టితీవెకా ♦ కరుణచేత
దాపిరక్షింపఁబూనిన ♦ దైవమేడి!
రేవతీకాంత! బలరామ! ♦ రిపువిరామ!

౮౦

సమాప్తము.